# తొలిపలుకు

---

శ్రీ పీఠికాపురాధీశ కళాశాలలోఁ బ్రవేశించి, మాధ్యమికతరగతి ప్రధానాంధ్రవిద్యార్థులకు (Inter Part III Advanced Telugu Students) 'వ్యాకరణము ఛందస్సు అలంకారము' అను విషయములను ఆంధ్రవిశ్వవిద్యాలయాధికారులు నిర్ణయించిన పాఠ్యక్రమమున కనుగుణముగ సులభమగు రీతిని బోధపడుటకై సంగ్రహించి కూర్చిన విషయమును 'ఆంధ్రలక్షణసారము' అను గ్రంథముగ నీవఱకు ముద్రించియుంటిని. దానిని విశ్వవిద్యాలయాధికారులు పాఠ్యగ్రంథముగా నిర్ణయించియున్నారు.

ప్రస్తుత మా గ్రంథమునందలి విషయములను సంగ్రహించి Part II Telugu విద్యార్థుల కనువుగ నుండుటకై మఱికొన్ని విషయములను గూర్చి యీ రెండవభాగమును బ్రకటించుచున్నాఁడను. Inter విద్యార్థులకే గాక Matriculation and S. S. L. C. విద్యార్థులకును గావలసిన ఛందోవ్యాకరణాలంకారవిషయము లిందుఁ గలవు. కావునఁ బరీక్షార్థులైన విద్యార్థు లీగ్రంథమును జదివి తగు లాభము నందిన, నాపరిశ్రమము సఫలమగునని భావించువాఁడను. ఈపుస్తకమును బఠించిన విద్యార్థులకు సామాన్యములైన ఆంధ్రభాషావ్యాకరణ విషయములు, ఛందోలంకార విషయములు సులభముగ విశదము కావలయునని నాయోపినకొలఁది యత్నించినాఁడను. నాయత్న మెంతవఱకు సఫలమో సహృదయులు నిర్ణయించెదరుగాక.

కాకినాడ
వందన,
దీపావళి.

ఇట్లు విన్నవించు
బుధవిధేయుఁడు,
చిలుకూరి పాపయ్యశాస్త్రి.

---

# విషయసూచిక

శ్రీ శారదాంబాయైనమః

# ఆంధ్రలక్షణసారము

## రెండవ భాగము

### అక్షర ప్రకరణము

శ్రీశైలము సింహాచలము శైషశైలము అను పర్వతములు సరిహద్దులుగా నుండెడి ప్రాంతమునందలి జనులు వ్యవహరించెడి భాషను 'ఆంధ్రభాష' యని యందురు. 'తేనుఁగు' 'తెలుఁగు' అనునవి దీనికి నామాంతరములు. ఈ భాషలో తత్సమములు, తద్భవములు, దేశ్యములు, గ్రామ్యములు అను నాల్గు విధము లయిన పదము లుండును.

ఆంధ్రవర్ణ సమామ్నాయము.

ఇట్టి భాషయం దుపయోగించు వర్ణము లేఁబదియాఱు.
అ ఆ ఇ ఈ ఉ ఊ ఋ ౠ ఌ ౡ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం ః.

క ఖ గ ఘ ఙ చ ౘ ఛ జ ౙ ఝ ఞ ట ఠ డ ఢ ణ త థ ద ధ న ప ఫ బ భ మ య ర ఱ ల వ శ ష స హ ళ.

అచ్చులు—వీనిలో 'అ' మొదలు 'ఔ' వఱకు నుండు వర్ణములను 'అచ్చులు' అని యందురు. 'స్వరములు, ప్రాణములు' అనునవి వీనికి నామాంతరములు. అందు అ ఇ ఉ ఋ ఌ ఎ ఒ అనునవి హ్రస్వములు. ఆ ఈ ఊ ౠ ౡ ఏ ఐ ఓ ఔ లు దీర్ఘములు. ఏ ఓ లు వక్రములు. ఐ ఔ లు వక్రతమములు.

హల్లులు—'క' మొదలు 'ళ' వఱకు నుండు వర్ణము లను 'హల్లులు' అని యందురు. 'వ్యంజనములు' 'ప్రాణులు' అనునవి నామాంతరములు.

క ఖ గ ఘ ఙ — కవర్గము

చ ఛ జ ఝ ఞ — చ వర్గము

ట ఠ డ ఢ ణ — ట వర్గము

త థ ద ధ న — త వర్గము

ప ఫ బ భ మ — ప వర్గము

య ర ఱ ల ళ వ — అంతస్థములు

శ ష స హ — ఊష్మములు.

ఉభయాక్షరములు—అర్ధానుస్వారము ( ఁ ) పూర్ణానుస్వారము ( ం ) విసర్గము ( ః ) ఈ మూఁడింటిని 'ఉభయాక్షరము' లని యందురు.

క చ చ ట త ప లు — పరుషములు

గ జ జ డ ద బ లు — సరళములు

మిగిలిన వర్ణము లన్నియును — స్థిరములు.

తత్సమాది భేదములు.

ఆంధ్రభాషయందలి పదములు— 1. తత్సమములు, 2. తద్భవములు, 3. దేశ్యములు, 4. గ్రామ్యములు—అని నాలుగు విధములు.

సంస్కృతపదమునకుఁ దెలుఁగు ప్రత్యయమును జేర్చుట వలన నేర్పడెడి పదములు తత్సమపదములు.

రామ=రాముఁడు. ఆకాశ=ఆకాశము.

ఇచట 'రామ' అను సంస్కృతశబ్దమునకు 'ఁడు' అను తెలుఁగు ప్రత్యయమును జేర్పఁగా 'రాముఁడు' అను పదమును 'ఆకాశ' అను సంస్కృతశబ్దమునకు 'ము' అను తెలుఁగు ప్రత్యయమును జేర్పఁగా 'ఆకాశము' అను పదమును నేర్పడినవి.

ఇట్లే —

| సంస్కృతము | తత్సమము | సంస్కృతము | తత్సమము |
|---|---|---|---|
| కుమార | కుమారుఁడు | సంతోష | సంతోషము |
| మనుష్య | మనుష్యుఁడు | ఆశ్చర్య | ఆశ్చర్యము |
| ధేను | ధేనువు | దోష | దోషము |

తత్+సమము=తత్సమము. దానితో సమానమైనది; అనఁగా సంస్కృతముతో సమానమైనది.

సంస్కృతశబ్దమునకొంత మార్పుచేసి వాడినచో దానికి 'తద్భవము' అని పేరు. ఆకాశ=ఆకసము. ఇచట 'ఆకాశ' అను శబ్దమునందలి వర్ణములు కొన్ని మార్పుచేసి 'ఆకసము' అని వాడఁబడినది. కావున నిట్టి పదము తద్భవము.

ఇట్లే —

| సంస్కృతము | తద్భవము | సంస్కృతము | తద్భవము |
|---|---|---|---|
| సంతోష | సంతసము | దోష | దోసము |
| ఆశ్చర్య | అచ్చెరువు | కుమార | కొమరుఁడు |

తత్+భవము=తద్భవము. అనఁగా సంస్కృతమునుండి పుట్టినది. సంస్కృతపదములు తద్భవములుగా మాఱునపుడు వానిలో వికార మేర్పడును. కావున వీనిని 'వికృతు' లనియు,

తత్సమపదములను 'ప్రకృతు' లనియు నందురు. ఈ విధముగ ప్రకృతి వికృతులను తత్సమ తద్భవములనుగా నెఱుఁగవలెను.

సంస్కృతముతో సంబంధ మేమియు లేక, తెనుఁగు దేశములో మొదటినుండియు వాడుకలో నున్న పదములు దేశ్య పదములు.*

ఆవు, ఎద్దు, నేను, నీవు, తల్లి, తండ్రి మొదలగునవి.

మాటలాడునప్పుడుమాత్రమే యుపయోగించు పదములు గ్రామ్యములు. ఉదా:—వస్తాడు, తెస్తాను, కొడుతుంది, చేస్తున్నాడు, రాస్తున్నాడు మొదలగునవి.

ఇట్టి పదములు వ్యాకరణవిరుద్ధములు; కావున పుస్తకములలో వ్రాయునపు డిట్టివాని నుపయోగింపరాదు.

తత్సమపదములును దేశ్యపదములును గలిసి 'అచ్చ తెలుఁగు' అనఁబడును. గ్రామ్యపదములను గ్రంథములలో నుపయోగించుటకు వీలులేదు. గ్రంథములలో నుపయోగించు తక్కిన మూఁడు విధములయినవానిని రెండు విధములుగా విడఁదీయవచ్చును.

1. తత్సమపదములు 2. అచ్చ తెలుఁగుపదములు.

---

* ఒకభాష మాటాడువారికి మఱియొకభాష మాటాడువారితో సంబంధము కలుగునపు డొక భాషలోని శబ్దములు కొన్ని మఱియొక భాషలోనికి వచ్చి చేరుచుండును. తెలుఁగుభాష కెప్పుడు సంస్కృతముతో సంబంధ ముండుటచే సంస్కృతశబ్దములు చాలవఱకుఁ దెలుఁగులోనికి వచ్చి చేరినవి. అట్లు చేరిన సంస్కృతశబ్దములను మార్పేమియుఁ జేయక వానికిఁ దెలుఁగు ప్రత్యయములను మాత్రము చేర్చి వాడుకొనియున్నాము. అట్టివే తత్సమములు. కొన్నిటికి మార్పుచేసి వాడుకొనియున్నాము. అట్టివి తద్భవములు అనఁబడుచున్నవి. ఇఁకఁ దెనుఁగు భాషలో మొదట నుండి వాడఁబడుపదములు దేశ్యములు అనఁబడును.

## అచ్చతెలుఁగులోని వర్ణములు.

అచ్చతెలుగులో నుండెడి వర్ణములు ముప్పదియేడు. వీనిలో నచ్చులు పదునాలుగు.

అ ఆ ఇ ఈ ఉ ఊ ఎ ఏ ఐ ఒ ఓ ఔ ఁ ం.

హల్లు లిరువదిమూఁడు.

క గ చ చ జ జ ట డ ణ త ద న ప బ మ య ర ఱ ల ళ వ స హ.

ఆంధ్రభాషకు వర్ణము లేఁబదియాఱని మన మీవఱకు దెలిసికొంటిమి. అనఁగా మిగిలిన పందొమ్మిది వర్ణములును తత్సమములందే యుండునని తెలియవలెను.

ఋ ౠ ఌ ౡ ః ఖ ఘ ఙ ఛ ఝ ఞ ఠ ఢ ణ థ ధ ఫ భ శ ష.

ఈ పందొమ్మిది వర్ణములు నేపదములందుఁ గనిపించునో యవి తత్సమపదములే యని నిర్ణయింపవచ్చును. ఉదా:— ఋషి, పితౄణము, క్లృప్తము, ౡకారము, అంతఃపురము, సుఖము, ఘనము, శార్ఙ్గము, ఛత్రము, ఝరి, యజ్ఞము, పాఠము, గూఢము, రథము, సంబంధము, ఫలము, భయము, ఆకాశము, సంతోషము మొదలగునవి.

అచ్చతెనుఁగునందు మాత్రమే యుండువర్ణము లయిదు. ఎ ఒ చ జ ఱ. ఎవఁడు, మొదలు, చలి, జాము, ఱంపము.

మఱియు పదముల మధ్యను స్వతస్సిద్ధముగా నుండెడి ఖండబిందువులతోఁ గూడినపదము లచ్చతెనుఁగు పదములే యగును.

కోలఁకు, వెలఁది, మఱఁది, వెలఁగ.

తత్సమపదములందును అచ్చతెలుఁగు పదములందును వాడఁబడు వర్ణము లేఁబదియాఱు. వానిలో తత్సమపదములందు మాత్రమే యుండువర్ణములు పందొమ్మిది. అచ్చతెనుఁగునందు మాత్రమే యుండు వర్ణము లైదు. ఈ యిరువదినాలుగును గాక మిగిలిన ముప్పదిరెండును తత్సమములందును అచ్చతెనుఁగునందును గూడ నుండును. కాఁబట్టి తత్సమములందుండు వర్ణములు మొత్తము 51. (32+19) అచ్చతెనుఁగునందలివి మొత్తము 37. (32+5).

### ద్రుతప్రకృతికములు—కళలు.

ప్రత్యయముగాఁ గాని, అవ్యయముగాఁ గాని, ఆగమముగాఁ గాని కన్పడునదియై ఉకారముతోఁ గూడిన నకారము (ను) ద్రుత మనఁబడును. ద్రుత మనఁగా ద్రవించునది. అనుస్వారముగాఁగాని, 'ని, న్'అను రూపములుగాఁ గాని మాఱునది; లేక లోపించునది; కావున దీని కీ పేరు వచ్చినది. ద్రుతము అంతమందుఁ గలవి ద్రుతప్రకృతికములు:—

ఆంధ్రభాషయందలి పదము లన్నియు, 'ద్రుతప్రకృతికములు, కళలు'అని రెండువిధములు. ద్రుతము చివరలేని పదములను 'కళ'లని యందురు. తెలుఁగుభాషలో వీనిభేదమును దెలిసికొనుట యావశ్యకము.

### ద్రుతప్రకృతికములు.

విభక్తులలో—ప్రథమావిభక్తి ప్రత్యయములు(డు,ము,వు,లు) కూర్చి, గుఱించి, కయి, పట్టి, యొక్క అను నీవిభక్తి ప్రత్యయములు గాక మిగిలిన విభక్తి ప్రత్యయములు.

నిఁ, నున్, లఁ, చేతఁ, చేఁ, తోడన్, తోఁ, కొఱకుఁ, వలనఁ, కంటెఁ, కిఁ, కుఁ, లోఁ, లోపలన్, అందుఁ, నఁ.

సమాపకక్రియలలో—ఉత్తమపురుషైకవచనములు:—

వండుచున్నాఁడను, వండితిని, వండఁగలను, వండుదును, వండను.

భూతతద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనములు:—

పాడెను, పాడును, పాడెడుఁ, పాడెడిఁ.

ఆశీరాద్యర్థకములయిన 'ఎడుఁ, తఁ' అను ప్రత్యయములు:-

కలిగెడుఁ, కలుగుతఁ.

అసమాపకక్రియలలో — శత్రర్థకము, తుమున్నర్థకము, ఆనంతర్యార్థకము, చేదర్థకము:—

పాడుచుఁ, పాడఁ, పాడఁగఁ, పాడుడున్, పాడినఁ.

సర్వనామములలో—నేను, తాను అనుపదములు.

అవ్యయములలో—ఎల్లఁ, ఇఁకఁ, ఇఁగన్, ఎట్లకేఁ కుఁ, పోలెఁ, వలెఁ, కైవడిఁ, ఒండెఁ, క్రమ్మఱఁ, పిదపఁ, గ్రక్కునఁ మొదలగునవి ద్రుతప్రకృతికములు.

కళలు.

విభక్తులలో—ప్రథమావిభక్తి ప్రత్యయాంతములు.

రాముఁడు, వనము, విష్ణువు, పొలములు, ఓ రాములార, వనితలార, కూర్చి, గురించి, కయి, పట్టి, యొక్క, అను విభక్తి ప్రత్యయములు.

సమాపకక్రియలలో—'ని, ను' అను ప్రత్యయములు చివర లేనివి:—

చదువుచున్నాము, చదివితిరి, చదువుచున్నావు, చదువుచున్నారు, చదువవు, చదువదు, చదువుము, చదువకుము.

అసమాపకక్రియలలో—క్త్వార్థక, వ్యతిరేకక్త్వార్థకములు:—

వండి, వండక.

అవ్యయములలో—కటకటా, అయ్యో, ఇంచుక, కొంచెము, బళి, బాపురే, ఔర, ఆహా, అపుడు, ఇపుడు, ఏమి, అ, ఆ, ఏ, మొదలగునవి.

ఆశీరాద్యర్థకమగు 'కాక' ఇచ్చుఁగాక; మున్నగునవికళలు.

---

## పద ప్రకరణము

అర్థమును దెలుపు ఒక్కవర్ణముగాని, వర్ణసముదాయముగాని పద మనఁబడును. అట్టి పదములనుగూర్చి తెలుపు ప్రకరణము పదప్రకరణము. ఆ, లే, పో, నగ, పనస మొదలగునవి పదములు.

ఇట్టి పదములు 'వ్యస్తపదము'లనియు 'సమాసపదము' లనియు రెండువిధములు. అనేకపదములు చేరి ఏకపద మయిన దానిని 'సమాసపద' మని యందురు. అట్లు గాక విడివిడిగా నుండు పదములను 'వ్యస్తపదము'లని యందురు. అలరువిల్తుఁడు రాజపురుషుఁడు మొదలగునవి సమాసపదములు. అలరు విల్లు మొదలగునవి వ్యస్తపదములు.

### 1 శబ్దభేదములు (Parts of Speech)

పదములు, 1. నామవాచకములు 2. సర్వనామములు 3. విశేషణములు 4. అవ్యయములు 5, క్రియలు అని యయిదు విధములు.

వీనిలో వస్తువుల నామములను దెలుపువానిని 'నామవాచకము'లని యందురు. వీనినే 'విశేష్యము' లనియు వ్యవహరింతురు. ఇవి నాలుగు విధములు.

1. సంజ్ఞావాచక నామవాచకములు (Proper Nouns)
2. జాతివాచకనామవాచకములు (CommonNouns)
3. గుణవాచకనామవాచకములు (Abstract Nouns)
4. క్రియావాచక నామవాచకములు (Verbal Nouns)

(1) ఒక వస్తువునకే చెందవలయు నని పెట్టిన పేళ్లు సంజ్ఞావాచకనామవాచకములు—

రాముఁడు, సీత, దమయంతి, గోదావరి మొదలగునవి.

(2) ఒక జాతిలోఁ జేరిన ప్రతివస్తువునకు జెందునట్టి పేళ్ళు జాతివాచక నామవాచకములు —

బాలుఁడు, మనుష్యుఁడు, చెట్టు, బాలిక మొదలగునవి.

(3) గుణములను దెలుపుపేళ్ళు గుణవాచక నామవాచకములు—తీపి, పులుపు, ఎఱుపు మున్నగునవి.

తెనుఁగున నామవాచకముకంటె భావార్థమున 'తనము, రికము, ఇమి, న' మొదలగు ప్రత్యయములు చేరుచుండును. ఇట్టివికూడ గుణవాచకనామవాచకములే యగును.

చిన్నతనము, కన్నెరికము, పేరిమి, నల్లన, అగ్గలిక.

(4) పనులపేళ్ళను దెలుపునవి క్రియావాచకనామవాచకములు—వండుట, వంట, వండమి, చేఁత, నడక మొదలగునవి. ధాతువులకంటె 'క, ఇమి, ఁత, కువ, ట, టు, పు, బడి, గడ, అకము' మొదలగు ప్రత్యయములు చేర్చుటచే క్రియావాచక నామవాచకము లగును.

అలుక, కలిమి, కోఁత, మెలఁకువ, ఆట, త్రేటు, ఏలుబడి, మనుగడ, ఎండ, అమ్మకము మున్నగునవి. ఇట్టివానిని 'భావార్థకకృదంతము' లనియు నందురు.

సర్వనామములు

నామవాచకములకు మాఱుగా వాడఁబడుశబ్దములను 'సర్వనామము'లని యందురు. సర్వనామ మనఁగా నన్నిటికిని జేరయినది. ఇవి యయిదు విధములు—

1. పురుషవాచకసర్వనామములు (Personal pronouns)
2. సంబంధవాచకసర్వనామములు (Relative pronouns)
3. ప్రశ్నవాచకసర్వనామములు (Interrogative pronouns)
4 సంఖ్యావాచకసర్వనామములు (Numeral pronouns)
5. అనిర్దిష్టసర్వనామములు (Indefinite pronouns)

(1) పురుషములను బోధించునవి పురుషవాచకసర్వనామములు.

పురుషములు మూఁడు:—1. ఉత్తమపురుషము 2 మధ్యమపురుషము. 3. ప్రథమపురుషము. తన్నుఁగూర్చి తెలుపునది ఉత్తమపురుషము, ఎదుటివానినిగూర్చి తెలుపునది మధ్యమపురుషము.మూఁడవవానినిగూర్చి తెలుపునది ప్రథమపురుషము.

| | | |
|---|---|---|
| ఉత్తమ పురుషము— | నేను | మేము |
| | ఏను | ఏము |
| మధ్యమ పురుషము— | నీవు | మీరు, మీరలు |
| | ఈవు | ఈరు, ఈరలు |
| ప్రథమ పురుషము— | వాఁడు | వారు, వారలు |

అతఁడు, వీఁడు, ఇతఁడు, ఎవఁడు, ఆమె, ఈమె, అది, ఇది, అవి, ఇవి మొదలగునవి.

(2) వాక్యమునందు మఱియొక సర్వనామముతో సంబంధించు నది సంబంధవాచక సర్వనామము.

ఎవఁడు బాగుగఁ జదువునో వాఁడు పరీక్షయందు తీర్ణుఁడగును. ఈవాక్యమున 'ఎవఁడు' అను సర్వనామము 'వాఁడు' అను సర్వనామముతో సంబంధించి యున్నది. కావున నిది సంబంధవాచక సర్వనామము.

ఇల్లాలు ఎవతె పతిభక్తి గలిగియుండెనో యామెకు గౌరవము హెచ్చు. ఏది యావశ్యకమైనదో దానినే మఱచిపోదుము. ఈ వాక్యములలో 'ఎవతె, ఏది' యనునవి సంబంధవాచక సర్వనామములు.

(4) సంఖ్యను దెలుపునవి సంఖ్యావాచక సర్వనామములు.

ఒకఁడు, ఇద్దఱు, ముగ్గురు, నలుగురు, మొదలగునవి.

(5) వాఁడు వీఁడు అనిగాని, ఇద్దఱు ముగ్గురు అనిగాని నిర్దేశించి చెప్పనివి అనిర్దిష్ట సర్వనామములు.

అన్ని, ఇన్ని, అందఱు, కొందఱు, పలువురు మున్నగునవి. ఈ సర్వనామములు విశేషణములుగను విశేష్యములుగను గూడ వాడఁబడును. ఉదా:—

అందఱు మనుష్యులు భుజింతురు. (విశేషణము)

అందఱు దుర్జనుని దూషింతురు. (విశేష్యము)

## విశేషణములు.

వస్తువులయందును పనులయందును గల విశేషములను దెలుపు మాటలు విశేషణము లనఁబడును. (Adjectives)

వస్తువులయందలి విశేషములను దెలుపువానిని 'నామవిశేషణము'లని యందురు.

నల్లని గుఱ్ఱము, తెల్లని మేడ, తియ్యని పండు.

పనులయందలి విశేషణములను దెలుపువానిని 'క్రియావిశేషణము' లని యందురు.

వడిగాఁ బోయెను, మెల్లఁగా నడిచెను.

తఱుచుగా నీ క్రియావిశేషణములకుఁ జివర 'కన్, గాన్' అను నవి చేరుచుండును.

నామవిశేషణములు నాలుగు విధములు :—

1. గుణవాచక విశేషణములు 2. సంఖ్యావాచక విశేషణములు 3. సర్వనామవిశేషణములు 4. ధాతుజవిశేషణములు.

(1) వస్తువులయందలి గుణమును దెలుపుమాటలు గుణవాచక విశేషణములు.

తెల్లని, తియ్యని, మంచి, చెడ్డ, పెద్ద.

(2) వస్తువుల సంఖ్యను దెలుపునవి సంఖ్యావాచకవిశేషణములు.

నాలుగు బల్లలు, పది వస్తువులు, ఇద్దఱు బాలురు.

(3) సర్వనామములే విశేషణములుగ వాడఁబడినచో నవి సర్వనామ విశేషణములు.

ఆ మనుష్యుఁడు, ఈ బాలుఁడు, ఏ బాలిక.

ఈ ఈవాక్యములలో 'ఆ ఈ ఏ' అనునవి సర్వనామ విశేషణములు. ఈ మూఁడిటినే తెలుఁగు వ్యాకరణమున 'త్రికము' అని యందురు.

(4) ధాతువులనుండి పుట్టినవిశేషణమును 'ధాతుజవిశేషణము' లని యందురు. వీనినే 'క్రియాజన్యవిశేషణము' లనియు

నందుగు. ఉదా:—చదివిన, చదువుచున్న, చదువఁగల, చదివెడి, చదువని—బాలుఁడు. పై రూపము లన్నియు 'చదువు' అను ధాతువునుండియే పుట్టుటచే ధాతుజవిశేషణము లైనవి. ఇట్టి ధాతుజవిశేషణము లయిదువిధములు.

i. భూతార్థక ధాతుజవిశేషణములు—
వచ్చిన, కొట్టిన, తినిన, తిన్న, విన్న, పోయిన, చూపించిన.

ii. వర్తమానార్థక ధాతుజవిశేషణములు—
వచ్చుచున్న, పోవుచున్న, చూచుచున్న, తినిపించుచున్న.

iii. భవిష్యదర్థక ధాతుజవిశేషణములు—
రాఁగల, కొట్టఁగల, తినఁగల, తినిపింపఁగల.

iv తద్ధర్మార్థక ధాతుజవిశేషణములు—
వచ్చెడి, వచ్చెడు, వచ్చు, కొట్టెడి, పోయెడు, చూపించెడి.

v. వ్యతిరేకార్థక ధాతుజవిశేషణములు—
రాని, తినని, పోవని, పంపని, చూపింపని, మొదలగునవి.

ధాతుజవిశేషణములకు 'అట్టి' అనునది వికల్పముగాఁ జేరును.

కొట్టుచున్నట్టి మగఁడు, కొట్టుచున్న మగఁడు.
కొట్టినట్టి బాలుఁడు, కొట్టిన బాలుఁడు.

### లింగములు—మహదమహన్మహతీవాచకములు

పుంలింగము, స్త్రీలింగము, నపుంసకలింగము అనునవి సంస్కృతవ్యాకరణమునకు సంబంధించినవి. సంస్కృతభాషలో లింగము శబ్దమును బట్టి యుండునేగాని యర్థమును బట్టి యుండదు. ఆంధ్రభాషలో సంస్కృతమునందువలెఁ గాక, యాంగ్ల

భాషలోవలె నర్థమును బట్టియే యీభేదమును గుర్తింపవలెను. కావుననే నిచట లింగములకు మాఱుగ "మహద్వాచకము, మహతీవాచకము, అమహద్వాచకము' అని వ్యవహరింతురు.

మనుష్యులలోఁ గాని, దేవతలలోఁ గాని పురుషులను బోధించుశబ్దములును వాని విశేషణములును మహద్వాచకములు. రాముఁడు, కృష్ణుఁడు, ఇంద్రుఁడు, తండ్రి, కొడుకు, ఉత్తముఁడు, నీచుఁడు.

స్త్రీలను బోధించుశబ్దములును వాని విశేషణములును మహతీవాచకములు. సీత, శకుంతల, సరస్వతి, కొమార్తె, నీచురాలు, ఉత్తమురాలు.

పశుపక్ష్యాదులను దెలుపు శబ్దములు, జడవాచకములును వాని విశేషణములును అమహద్వాచకములు.
ఆవు, కుక్క, పాము, చెట్టు, వనము, ఉత్తమము, నీచము.

అకారాంతములై పుంలింగములైన మహద్వాచకములకు 'ఁడు' వచ్చును. ఉదా:—రాముఁడు, కృష్ణుఁడు, బాలుఁడు, వీరుఁడు. అకారాంతములైన నపుంసకలింగములకును, అకారాంతములైన అమహద్వాచకములకును 'ము' వచ్చును.

మిత్త్రము, వనము, వృక్షము.

ఇకారాంతశబ్దముల కేదియు రాదు

హరి, మతి, గౌరి, అక్షి, శ్రీ

ఉకారాంతశబ్దములకు 'వు' వచ్చును.

విష్ణువు, ధేనువు, మధువు, భ్రూవు.

ఇఁక నచ్చ తెలుఁగు శబ్దములు కొన్ని పుంలింగసమములును కొన్ని స్త్రీలింగసమములును, కొన్ని నపుంసకలింగసమములు నై యుండును. పుంలింగసమములకు 'ఁడు' వచ్చును.

ఉ:—మగఁడు, మనుమఁడు, కయిరఁడు, కత్తెళఁడు.

నపుంసకనమములకు 'ము' వచ్చును.

అందము, చందము, అల్లము, బియ్యము.

స్త్రీలింగనమముల కేదియును రాదు.

తండ్రి, తల్లి, అన్న, బల్ల మొదలగునవి.

వచనములు

తెలుఁగులో వచనములు రెండు:— 1. ఏకవచనము 2. బహువచనము. సంస్కృతమునందలి ద్వివచన మీభాషలో లేదు. అదియును బహువచనమునందే చేరును. ఒక వస్తువును దెలుపుమాట 'ఏకవచనము'. ఒకటికంటె నెక్కువవస్తువులను దెలుపుమాట బహువచనము.

ప్రథమావిభక్తి ప్రత్యయములలో 'డు ము వు' అను నీ మూఁడును ఏకవచనమునందే వచ్చును. 'లు' అనునది బహువచనమునం దన్నిశబ్దములకంటెను వచ్చును. మువర్ణమునకు ద్విత్వముకాని బిందుపూర్వకమయిన బు (ంబు) గాని వికల్పముగా వచ్చును.

వనము-వనంబు, వనమ్ము. ధనము-ధనంబు, ధనమ్ము.

ఉకారాంతమహద్వాచకములకంటె 'డు వు' లలో నేదియేని రావచ్చును. గురుఁడు, గురువు. శంభుఁడు, శంభువు.

హలంతములైన సంస్కృతశబ్దముల తుదిహల్లునకు ద్విత్వము వచ్చును. వాక్-వాక్కు. మరుత్-మరుత్తు.

సకారాంతములైన హలంతశబ్దముల తుదిహల్లు వికల్పముగ లోపించును.

ఉరము, ఉరస్సు. మనము, మనస్సు. ధనువు, ధనుస్సు.

చరిత్రము మొదలగు శబ్దముల 'ము' వర్ణమునకులోపము బహుళముగా వచ్చును.

చరిత్ర-చరిత్రము. చరిత- చరితము. అభిలాష- అభిలాషము.

బహుళ మనుటచే దర్భ పనస మున్నగుశబ్దములలో నీలోపము నిత్యముగా వచ్చును.

బహువచనము పరమగునపుడు కొన్నిశబ్దముల తుది వర్ణము లోపించును. పేను-పేలు. మీను-మీలు. రేయి-రేలు. వ్రాయి-వ్రాలు. ఆవు-ఆలు.

కొన్ని తెలుఁగు శబ్దముల బహువచనమునకు 'రు' వచ్చును.

బాలుఁడు-బాలురు. నృపాలుఁడు-నృపాలురు. అల్లుఁడు-అల్లురు.

'లు ల, న' లు పరమగునపుడు కొన్నిచోట్ల ముువర్ణము నకు లోపమును, దానికి ముందున్న యచ్చునకు దీర్ఘమును వికల్పముగా నగును.

వజ్రములు—వజ్రాలు, వజ్రాలను.

పగడములు—పగడాలు, పగడాన.

ప్రథమాదివిభక్తులు

ఒక వాక్యములో విశేష్యములకుఁ గాని, సర్వనామము లకుఁ గాని వేర్వేఱు పదములతోఁ గలుగు సంబంధమును దెలుపు ప్రత్యయములను విభక్తిప్రత్యయము లందురు. అవి యేడు విధములు.

డు, ము, వు, లు—ప్రథమావిభక్తి

ని, ను, లన్, కూర్చి, గుఱించి—ద్వితీయావిభక్తి

చేన్, చేతన్, తోన్, తోడన్—తృతీయావిభక్తి

కొఱకున్, కై—చతుర్థీ విభక్తి
వలనన్, కంటెన్, పట్టి—పంచమీ విభక్తి
కిన్, కున్, యొక్క, లోన్, లోపలన్ షష్ఠీ విభక్తి
అందున్, నన్—సప్తమీ విభక్తి.

ఎదుటివారిని బిలుచునపుడు విశేష్యముల మీఁద నుండు ప్రథమావిభక్తిని 'సంబోధన ప్రథమా విభక్తి'యని యందురు,

ఈవిభక్తిలో నామవాచకమునకు ముందు ఓ, ఓయి. ఓరి, ఓసి అనునవి వికల్పముగాఁ జేరుచుండును.

ప్రాతిపదికార్థమునందు ప్రథమావిభక్తి వచ్చును.

రాముఁడు, శంభువు, వనము, గిరులు, తరులు.

సంబోధనమున నామవాచకముల తుదినున్న ఉకారమునకు అకారము వచ్చును. రాముఁడ, వనమ, బంధువ, బంట. ఓ రాముఁడ, ఓ వనమ, ఓ బంధువ, ఓరి బంట, ఓసిచెలీ.

'డు' అంతమందుఁగల శబ్దములకు ద్వితీయాదివిభక్తుల యేకవచనము పరమగునపుడు 'ని' అనునది వికల్పముగ వచ్చును. రామునిని, రాముని. రామునిచేతన్, రాముచేతన్. శంభునిని, శంభుని. శంభునిచేతన్, శంభుచేతన్.

4 ద్వితీయ మొదలగు విభక్తులు పరమగునపుడు బహువచనమున 'ల' అనునది ఆగమముగా వచ్చును. రాములన్, రాములచేతన్, రాములకొఱకున్, వనములన్, వనములందున్.

ఇకార ఈకార ఐకారాంత శబ్దములకు షష్ఠీవిభక్తిలో ఏకవచనమున 'కిన్' వచ్చును. హరికిన్, శ్రీకిన్, మైకిన్. పైకిన్.

ఇవిగాక తక్కినచోట్ల 'కున్' వచ్చును. తాతకున్. గోడకున్, నాకున్, మాకున్.

'కున్' పరమగునపుడు ఉకారఋకారములకు 'న' అను నాగమము నిత్యముగా వచ్చును రామునకున్, విధాతృనకున్, వనమునకున్, మొదలగునవి.

అందు పరమగునపుడు ఉకారఋకారములకు 'ను' ఆగమముగా వచ్చును. రామునందున్, వనమునందున్, విధాతృనందున్.

ఉకారాంతములగు అమహద్వాచకములకు సప్తమ్యేకవచనమున 'నన్' ప్రత్యయము వచ్చును. వనమునన్, మనమునన్ మొదలగునవి.

ఔపవిభక్తికములు

'ఔపవిభక్తికము' లనఁగా దగ్గఱ నుండెడి విభక్తి నాధారముగాఁ జేసికొని, కొన్ని శబ్దములకు ఆదేశముగాఁ గాని, ఆగమముగాఁ గాని, రెండు విధములుగాఁ గాని వచ్చునట్టి 'ఇ, టి, ంటి, తి' అను వర్ణములు ఔపవిభక్తికములు. ఇవి ద్వితీయాది విభక్తులు పరమగునపుడు కొన్ని నామవాచకములకును 'సర్వనామములకును దఱుచుగఁ జేరుచుండును.'

ఇ—ఊరు-ఊరిని,ఊరికిన్,ఊరియందున్,కోడలు-కోడడలిని. చెల్లెలు-చెల్లెలికై. కాలు-కాలితో, కాలికిన్. వ్రేలు-వ్రేలికిన్, వ్రేలియందున్.

టి,ంటి—అన్ని, అన్నిటిని, అన్నింటిని.

తొమ్మిది, తొమ్మిదిటికి, తొమ్మిదింటికి.

పగలు—పగటికి, పగలిటికి, పగలింటికి.

విల్లు—వింటిని. కన్ను—కంటిని. ఇల్లు—ఇంటికిన్.

ఇ, టి—గోరు-గోరిని,గోటిని. నోరు-నోరితోన్, నోటితోన్.

తి—అట్టు—అటితిని. కొట్టు—కొటితిని.
గోయి—గోతిని, గోతిలోన్.

ఔపవిభక్తికశబ్దములమీఁద తృతీయాసప్తమీవిభక్తులకు 'అన్' బహుళముగా నగును. గోరన్ గీఱెను. (గోరన్=గోరితో) గొడ్డటన్ నఱకెను. (గొడ్డటన్=గొడ్డటితో) నూతన్ బడెను. (నూతన్=నూతియందు).

## అవ్యయములు

లింగము విభక్తి వచనము లేనివి అవ్యయములు. ఇవి లాక్షణికములు, ప్రతిపదోక్తములు అని రెండు విధములు. లాక్షణికము లనఁగా లక్షణముచే (శాస్త్రముచే) సిద్ధమైనవి. క్రియలనుండి పుట్టిన క్త్వార్థకములు వ్యతిరేకక్త్వార్థకములు, శత్రర్థకములు, తుమున్నర్థకములు, ఆనంతర్యార్థకములు, చేదాద్యర్థకములు. 'కన్, కాన్' అనునవి చివరగలవి (చల్లఁగన్, చల్లఁగాన్) లాక్షణికమైన యవ్యయములు.

చదివి, చదువక, చదువన్, చదువుచున్, చదువుటకున్, చదివినన్.

సముచ్చయార్థకమయిన 'ను,యును' చివర నున్నవి—

శ్రీకృష్ణుఁడును, సత్యభామయును, శీరియును ద్వారకకు వచ్చిరి.

అవ్యయముఁలని ప్రత్యేకముగఁ జెప్పఁబడినవి ప్రతిపదోక్తములైన యవ్యయములు.

అంతన్, అఁట, అకట, అదిగో, అద్దిర, అవుర, ఆహా, ఇఁకన్, ఇంచుక, ఇసీ, ఊరక, ఎంత, ఎట్టు, ఎప్పటి, ఎల్ల, ఏల, ఒండెన్, ఒకో, ఓయి, ఓహో, కటకటా, కట్టా, కడున్, కద, కనుకన్, కరము, కాని, కాఁబట్టి, కావునన్, కొలన్,

క్రమ్మఱన్, గ్రక్కునన్, చీ, చేసి, తద్దయున్, తరువాతన్ దనుకన్, దాఁకన్, నెఱి, పిదపన్, పిమ్మటన్, ఒళ్లి, బాపు, మజ్ఝా, మఱి, మిక్కిలి, మిన్నక, వెండి, వెండియున్, హాహోరాహోరి మొదలగునవి.

## క్రియలు.

పనులను దెలుపుమాటలను 'క్రియ' లందురు. ప్రత్యయములు చేరకమునుపు క్రియలను 'ధాతువు' లని యందురు. ధాతువు లన్నిటికిని జివర 'ఉకారమ్' ముండును.

చేయు, వండు, వ్రాయు, నిద్రించు, కలిగించు.

### ౧. తత్సమములు-ఆచ్ఛికములు.

ఇట్టి ధాతువులు తత్సమములు ఆచ్ఛికములు అని రెండు విధములు. కొన్ని సంస్కృతశబ్దములపై 'ఇంచుక్' చేరుటవలన నేర్పడునవి తత్సమములు.

పోషించు, సంతోషించు, భుజించు, రుచించు.

కొన్ని సంస్కృతశబ్దములపై 'ఇల్లు' చేర్చుటవలన నేర్పడునవి.

భాసిల్లు, రంజిల్లు, వర్ధిల్లు, విలసిల్లు.

దేశ్యములు తద్భవములు నగు ధాతువులు ఆచ్ఛికములు.

ఉండు, పోవు, తిను, పలుకు, ఉలుకు, పరగు.

### ౨. సకర్మకములు—అకర్మకములు.

పై రెండు విధములయిన ధాతువులు సకర్మకములు, అకర్మకములు అని రెండువిధములు. కర్మము నాకాంక్షించునవి సకర్మకములు. అనఁగా నే వాక్యమునందున్ క్రియనుబట్టి దేనిని వేనిని అనుప్రశ్న ముండునో యట్టివి. బాలుఁడు పండును దినెను. ఈవాక్యమున బాలుఁడు దేనిని దినెను? అను

ప్రశ్నమునకు, 'పండును' అను సమాధానము వచ్చుచున్నది. కావున 'తిను' ధాతువు సకర్మకము. కర్మను నాకాంక్షింపనివి అకర్మకములు. అనఁగా నే వాక్యమునఁ గ్రియనుబట్టి దేనిని వేనిని అనుప్రశ్న ముండదో యట్టివి.

బాలుఁడు నిద్రించెను. ఈ వాక్యమున దేనిని వేనిని అను ప్రశ్నము లేదు. కావున 'నిద్రించు' అను ధాతువు అకర్మకము.

3. స్వార్థకములు—ప్రేరణార్థకములు

పై ధాతువు లన్నియు స్వార్థకములు ప్రేరణార్థకములు అని మరల రెండు విధములు.

పనినిమాత్రము తెలుపునవి స్వార్థకములు.

భుజించు, నిద్రించు, చేయు, తిను, వండు, పరుగెత్తు.

పనిచేయుటకై యొకనిని బ్రేరేపించుటను దెల్పునవి ప్రేరణార్థకములు.

భుజింపించు, నిద్రింపించు, చేయించు, తినిపించు, వండించు, పరుగెత్తించు.

ప్రేరణార్థకమునఁ గొన్ని ధాతువులకు 'ఇంచు,' కొన్నిటికి 'చు' కొన్నిటికి 'పు' వచ్చును. కొన్నిటి కిందు రెండేసి మూఁడేసి వచ్చును.

| స్వార్థకములు. | | ప్రేరణార్థకములు. | స్వార్థకములు. | | ప్రేరణార్థకములు |
|---|---|---|---|---|---|
| ఇంచు— | చదువు | చదివించు | చు— | విఱుగు | విఱుచు |
| | నవ్వు | నవ్వించు | | మునుఁగు | ముంచు |
| | చెప్పు | చెప్పించు | పు— | చూచు | చూపు |
| | నగించు | నిగియించు | | నేరుచు | నేరుపు |
| | పంపు | పంపించు | | మేయు | మేపు |
| | భుజించు | భుజింపించు | | రేఁగు | రేఁపు |

౪. ఆత్మనేపదార్థకములు.

క్రియాఫలము ఆత్మను (కర్తను) జెందునేని యట్టిధాతువు 'ఆత్మనేపదార్థకము' అనఁబడును.

ఆత్మనేపదార్థమునందు ధాతువునకుఁ జివర 'కొను' అనునది చేర్పఁబడును. వండుకొనుచున్నాఁడు. ఇందు వంటకము చేయునాతఁడే భుజించు నని యర్థము. ఇట్లే వ్రాసికొనుచున్నాఁడు. చదువుకొనుచున్నాఁడు

కొనుధాతువు పరమగునపుడు యకారాంతధాతువులకు నిత్యముగను, ఇతరములకు వికల్పముగ 'ఇ' వచ్చును.

వండుకొనుచున్నాఁడు, వండికొనుచున్నాఁడు.

కొట్టుకొనుచున్నాఁడు, కొట్టికొనుచున్నాఁడు.

ఇకారము పరమగునపుడు యకారమునకు సకారము నిత్యముగా వచ్చును.

చేయు+కొనియె—చేయు+ఇ+కొనియె=చేసికొనియె.

ఇట్లే మూసికొనియె, వ్రాసికొనియె, వేసికొనియె.

అకర్మకధాతువులకు ఆత్మనేపదార్థక ముండదు. 'పరుగెత్తుకొనియె,నిద్రించుకొనియె,అని యుండదుగదా. పై ధాతువులన్నిటినుండియు సమాపకములు అసమాపకములు నగు క్రియలు పుట్టును.

పోషించు - పోషించెను, పోషించి; తిను- తినెను, తిని; నిద్రించు- నిద్రించెను, నిద్రించి; తినిపించు- తినిపించెను, తినిపించి; చంపు-చంపెను, చంపి; చంపఁబడు- చంపఁబడెను, చంపఁబడి; వండుకొను—వండుకొనె,వం డుకొని.

## సమాపకక్రియలు.

వాక్యమును ముగించునవి 'సమాపకక్రియ' లనఁబడును. రాముఁడు నిన్న వచ్చెను. నే నింటిలో నుంటిని.

ఈసమాపకక్రియ లెనిమిది విధములు—

1. వర్తమానార్థకములు
2. భూతార్థకములు
3. భవిష్యదర్థకములు
4. తద్ధర్మార్థకములు
5. వ్యతిరేకార్థములు
6. ఆశీరాద్యర్థకములు
7. ప్రార్థనాద్యర్థకములు
8. వ్యతిరేకప్రార్థనాద్యర్థకములు.

ధాతువునకు ప్రథమమధ్యమోత్తమ పురుషములలో నీ క్రింది ప్రత్యయములు వచ్చును.

| | ఏకవచనము. | బహువచనము. |
|---|---|---|
| ప్రథమపురుషము | డు | రు |
| మధ్యమపురుషము | వు | రు |
| ఉత్తమపురుషము | ను | ము |

అమహదర్థమున ప్రథమపురుషమునందు 'దు, వు' లగును. 'ఉన్న' అను అనుబంధముమీఁద నవి 'ది, వి' లుగా మాఱును. మహత్యర్థమున ఏకవచనము అమహత్తువలెను, బహువచనము మహత్తువలెను అగును.

(1) జరుగుచున్న పనిని దెలుపుక్రియ వర్తమానార్థకము— వర్తమానకాలమున క్రియకు 'ఉన్న' అనునది అనుబంధముగా వచ్చును. దీనికి ముందు 'చు' అనునది ఆగమముగా వచ్చును. వండు+చు+ఉన్న=వండుచున్న. ది, వి, అను ప్రత్యయములు తప్ప మిగిలిన ప్రత్యయములు పరమగునపుడు 'ఉన్న' అనునది దీర్ఘాంత మగును.

| | | ఏక | బహు |
|---|---|---|---|
| ప్ర. పు. | (మహ) | చదువుచున్నాఁడు | చదువుచున్నారు |
| | (అమహ) | చదువుచున్నది | చదువుచున్నవి |
| మ. పు. | | చదువుచున్నావు | చదువుచున్నారు |
| ఉ. పు. | | చదువుచున్నాను | చదువుచున్నాము |

(2) జరిగిపోయిన పనిని దెలుపునది భూతార్థకము— భూతకాలమున ధాతువున కేకవచనమునందు 'ఎను' ప్రత్యయము మగును. అమహద్వాచక బహువచనమునం గూడ నిదియే వచ్చును. మఱియు ధాతువు తుది నున్న ఉకారమునకు ఇకార మగును. వు, ను, రు, ము, అను ప్రత్యయములు పరమగునపుడు ధాతువునకు 'తి' వర్ణకము వచ్చును. ఇకారము మీఁది వు, ను, రు, ము, ల ఉకారమునకు ఇకార మగును.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. పు. | చదివెను | చదివిరి |
| మ. పు. | చదివితివి | చదివితిరి |
| ఉ. పు. | చదివితిని | చదివితిమి |

మధ్యమపురుషమునందలి వకారము వికల్పముగ లోపించును.

చదివితివి=చదివితి. చదివితి+ఇ=చదివితి.

(3) జరుగనున్నపనిని దెలుపునది భవిష్యదర్థకము— భవిష్యదర్థమున ధాతువునకు 'కల' అనునది అనుబంధముగా నగును; అగుచో 'న్' ఆగమమును, ధాతువు తుది ఉకారమునకు అకారమును వచ్చును.

చదువు+కల=చదువ+న్+కల=చదువఁగల.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. పు. | చదువఁగలఁడు | చదువఁగలరు |
| మ. పు. | చదువఁగలవు | చదువఁగలరు |
| ఉ. పు. | చదువఁగలను | చదువఁగలము |

వ్యవహారములో మాత్ర మీరూపములు భవిష్యదర్థమున వాడఁబడక శక్తిసూచకముగ వాడఁబడుచున్నవి. చదువఁగలను=చదువుటకు నాకు శక్తి గలదు అని యర్థము.

(4) మీఁది మూఁడుకాలములకంటె వేఱై ఆమూఁడుకాలములందును జరుగు పనిని దెలుపునది తద్ధర్మార్థకము.

భూమి తిరుగును. పక్షులు ఎగురును.

తద్ధర్మార్థకమునందు ప్రథమపురుషైకవచనమున 'ను' అమహద్వాచక ఏకవచన బహువచనములందును 'ను, ఎడుఁన్, ఎడిఁన్' అను ప్రత్యయములు వచ్చును. మిగిలినచోట్ల 'దు, ఎద' అనునవి ఆగమములుగను వచ్చును.

| | ఏక | బహు |
|---|---|---|
| ప్ర. పు. (మహా) | చదువును | చదువుదురు |
| (అమ) | చదువును | చదువును |
| మ. పు. | చదువుదువు | చదువుదురు |
| ఉ. పు. | చదువుదును | చదువుదుము |

రూపాంతరము.

ప్ర. పు (మహా) చదివెడుఁన్, చదివెడిఁన్–చదివెదరు, చదువుదురు

• (అమహా) చదివెడుఁన్, చదివెడిఁన్–చదివెడుఁన్, చదివెడిఁన్

మ. పు. చదివెదవు, చదువుదువు–చదివెదరు, చదువుదురు

ఉ. పు. చదివెను, చదువును–చదివెదము, చదువుదుము

4

ఇప్పటివ్యవహారములో నీతద్ధర్మార్థకక్రియ భవిష్యదర్థమున వాడఁబడుచున్నది. ఉదా:—నేను రేపు చదువుదును.

(5) వ్యతిరేకార్థకము—పని జరుగనట్లు తెలుపుక్రియలు వ్యతిరేకార్థకములు. ఈక్రియలు మూఁడుకాలములకు సంబంధించి యుండును. అన్నిపురుషములలోను ధాతువునకుఁ జివర 'అకారము' చేరును.

| | ఏక | బహు | ఏక | బహు |
|---|---|---|---|---|
| ప్ర. పు. (మహ) | అఁడు | అరు | చదువఁడు | చదువరు |
| (మహతి) | అదు | అరు | చదువదు | చదువరు |
| (అమహ) | అదు | అవు | చదువదు | చదువవు |
| మ. పు. | అవు | అరు | చదువవు | చదువరు |
| ఉ. పు. | అను | అము | చదువను | చదువము |

ఇట్లే చేయఁడు, వండఁడు, కొట్టింపఁడు మొదలగునవి.

(6) ఆశీరాద్యర్థకములు—దీవించుట, శపించుట మున్నగు నర్థముల నిచ్చుక్రియలు ఆశీరాద్యర్థకములు. ఈయర్థమున ధాతువునకు ఎడున్, తన్, అనుపత్యయములు అన్నిపురుషములందును వచ్చును.

ఆశీస్సు—నీకు ధనము గలిగెడున్, మీకు ధనము కలుగుతన్.

శాపము—నీకు నరక మయ్యెడున్, మీకు నరక మగుతన్.

తద్ధర్మార్థక క్రియలకు తుదిని 'కాక, కాతన్, కావుతన్' అనువానిని జేర్చి ఆశీరాద్యర్థములందు వాడుదురు.

కలుగుఁగాక, కలుగుఁగాతన్, కలుగుఁగావుతన్.

అగుఁగాక, అగుఁగాతన్, అగుఁగావుతన్.

'ఎడు, త' ల ద్రుతమునకు, అచ్చు పరమగునపుడు మకారము ఆదేశముగా వచ్చును.

కలిగెదుర్ + అనియె = కలిగెదు రనియె.

కలుగుతేర్ + అనియె = కలుగుతే రనియె.

(7) ప్రార్థనాద్యర్థకములు—ఒక పని చేయుమని ప్రార్థించుట అడుగుట ఆజ్ఞాపించుట అను వీనిని దెలుపునట్టి క్రియలు ప్రార్థనాద్యర్థకములు ఈయర్థములందు ధాతువునకు ఏకవచనమున 'ము' బహువచనమున 'డు' వచ్చును.

ప్రార్థనము—నన్ను రక్షింపుము, నన్ను రక్షింపుడు.
అడుగుట—మిత్రుఁడా! నాతోరమ్ము, మిత్రులారా! నాతోరండు.
ఆజ్ఞాపించుట—పుస్తకము చదువుము, పుస్తకము చదువుఁడు.

ఈక్రియలను ఆశీశ్శాపాద్యర్థములందును వాడుదురు.

ఉదా:—ధనవంతుఁడ వగుము. దరిద్రుల రగుఁడు.

విధ్యర్థమున 'ఎదు, త' అను వానికి మారుగ ద్రుత పూర్వక మయిన 'అది' యగును.

నీవు వచ్చునది, వ్రాయునది, చేయునది మొదలగునవి.

8. వ్యతిరేకప్రార్థనాద్యర్థకములు—పనిచేయవలదని ప్రార్థించుటను అడుగుటను ఆజ్ఞాపించుటను దెలుపునట్టి క్రియలు వ్యతిరేకప్రార్థనాద్యర్థకములు. వ్యతిరేక ప్రార్థనాద్యర్థంబున వచ్చు 'ము, డు' లకు ముందు 'కు' అగును. అగుచో ధాతువు తుదినున్న ఉకారమునకు అకారము వచ్చును.

చేయకుము—చేయకుఁడు. తప్పకుము—తప్పకుఁడు.

మన మెల్లపుడు ఎదుటివానిని ప్రార్థింతుము, అడుగుదుము, ఆజ్ఞాపింతుము. కావున ప్రార్థనాద్యర్థకములకు వ్యతిరేక ప్రార్థనాద్యర్థకములకు మధ్యమపురుషమే కాని యితర పురుషము లుండవు.

పై క్రియ లన్నిటియందలి ఉత్తమపురుషైకవచనంబులు, భూతతద్ధర్మార్థక ప్రథమపురుషైకవచనములు, ఆశీశ్శాపాద్యర్థకములయిన 'ఎడు, త' లును, దుత్రప్రకృతికములు మిగిలిన వన్నియును గళలు.

అసమాపక క్రియలు.

వాక్యమును సమాప్తి చేయలేనట్టి క్రియలు అసమాపక క్రియలు. ఇవి ఆఱు విధములు.

1. క్త్వార్థకము. 2. వ్యతిరేక క్త్వార్థకము. 3. తుమున్నర్థకము చేదర్థకము. 5. అనంతర్యార్థకము. 6. శత్రర్థకము.

(1) ధాతువునకుఁ జివర 'ఇ' వచ్చినచో క్త్వార్థక మగును.

చదువు + ఇ = చదివి, చదువుట అనుపనిచేసి యనియర్థము.

బాలుఁడు చదివి పరుగెత్తెను. ఇట్లే వినీ, చెప్పి, చేయించి.

(2) ధాతువునకు 'అక' చేర్చినచో వ్యతిరేక క్త్వార్థక మగును.

చదువు + అక = చదువక. చదువుట యనుపనిచేయక యని యర్థము. నేను బడిలోఁ జదువక వెడలిపోయితిని. ఇట్లే : తిట్టక, నవ్వక, చెప్పింపక మొదలగునవి.

(3) ధాతువునకు 'అన్' చేర్చినచో తుమున్నర్థక మగును.

చదువు + అన్ = చదువన్ = చదువుట యనపని చేయుటకై.

గురువు నన్నుఁ జదువ నాజ్ఞాపించెను.

ఇట్లే—పలుకన్, వినన్, అనన్, పలికింపన్ మొదలగునవి. వీనికిఁ జివర నొకప్పుడు 'గన్' 'గాన్' అనునవి చేగుచుండును. చదువఁగన్, చదువఁగాన్, వినఁగన్, వినఁగన్,

(4) ధాతువునకు 'ఇనన్' చేర్చినచో చేదర్థక మగును.

చదువు + ఇనన్ = చదివినన్ = చదువుట యనుపని చేసినయెడల.

నీవు చదివిన నేను చెప్పెదను. ఇట్లే చేసిన, వినిన, వినిపించిన.

(5) ధాతువులకు 'డున్' చేర్చినచో ఆనంతర్యార్థకమగును.

చదువు+డున్=చదువుడున్=చదివినవెంటనే యని యర్థము.

వాఁడు చదువుడున్ నేను వచ్చితిని.

ఆనంతర్యార్థమున నొకప్పుడు తుమున్నర్థకము చేదర్థకము కూడ వాడఁబడును. వాఁ డిట్లు చెప్పఁగన్, చెప్పినన్ విని యాశ్చర్యపడితిని. చెప్పఁగన్=చెప్పినవెంటనే యని యర్థము.

(6) ధాతువులకు 'చున్' చేర్చినచో శత్రర్థక మగును.

చదువు+చున్=చదువుచున్, చదువుట యను పనిచేయుచు.

గురువు మంత్రములు చదువుచు దీవించెను.

ఇట్లే—తినుచున్, వినుచున్, చదివించుచున్ మొదలగునవి.

పై యాఱువిధములయిన అసమాపకక్రియలలో క్త్వార్థకమును వ్యతిరేకక్త్వార్థకమును గలవు. మిగిలిన వన్నియు ద్రుతప్రకృతికములు.

## కృత్ప్రత్యయాంతములు.

ధాతువులవలన నేర్పడు నామవాచకములు 'కృదంతము' లనఁబడును. కృత్ప్రత్యయములు ధాతువుకంటె భావార్థమునందు వచ్చును.

ఈకృత్ప్రత్యయములు పరమగునపుడు కొన్ని ధాతువుల తుదియక్షరము లోపించును.

1. 'క' అలుగు-అలుక. ఎఱుఁగు-ఎఱుక. కలఁగు-కలఁక
 నడచు-నడక. తునుగు-తునుక

2. 'ఇమి' కలుగు-కలిమి. నేరుచు-నేరిమి. బ్రతుకు-బ్రదిమి.

3. 'త' చేయు-చేత. మేయు-మేత. కూయు-కూత
4. 'కువ' అడగు-అడకువ. కలగు-కలకువ. పెరగు-పెరకువ
5. 'ట' ఆడు-ఆట. పాడు-పాట. ఊరు-ఊట
6. 'టు' పడు-పాటు. చెడు-చేటు. కఱచు-కాటు. పొడుచు-పోటు
7. 'త' ఆవులించు-ఆవులింత. కుళ్లగించు-కుళ్లగింత
8. 'వము' తిరియు-తిరివము. పొలయు-పొలవము
9. 'పు' మాయు-మాపు. మేయు-మేపు. తలచు-తలపు
10. 'గడ' చేరు-చేరుగడ. మను-మనుగడ. తీఱు-తీఱుగడ
11. 'ఇకి' కోరు-కోరికి. మను-మనికి. విను-వినికి
12. 'వు' మను-మనువు. చచ్చు-చావు. పూచు-పూవు
13. 'అకము' మాఱు-మాఱకము. అమ్ము-అమ్మకము
14. 'అ' ఎండు-ఎండ. గీఱు-గీఱ. ఊదు-ఊద
15. 'డు' ఆఱు-ఆఱుడు. అమ్ము-అమ్ముడు. త్రొక్కు-త్రొక్కుడు.

ఈ ప్రత్యయములు కొన్ని ధాతువులకంటె కర్త్రర్థమునందును, కర్మార్థమునందునుగూడ వచ్చుచుండును.

### తద్ధితప్రత్యయాంతములు.

నామవాచకములకంటెను, కొన్ని విశేషణములకంటెను స్వార్థమునందును, భావము మున్నగు విశేషార్థములందును వచ్చు ప్రత్యయము తుదినున్న వానిని తద్ధితప్రత్యయాంతము లందురు.

#### స్వార్థకములు.

1. 'ఉక' చిఱుత-చిఱుతుక. నెలత-నెలతుక. నిప్పు-నిప్పుక
2. 'ఇక' అరమర-అరమరిక. వాలు-వాలిక. మొలి-మొలిక. మూన-మూనిక
3. 'కార' కొల-కొలగారము. నుడి-నుడికారము
4. 'ఇత' ఇంపు-ఇంపితము. బిగి-బిగితము. పోరు-పోరితము.

భావార్థకములు.

5 'తన' దొంగ-దొంగతనము. మగతనము, గొప్పతనము.

6. 'ఱిక' చిన్న-చిన్నఱికము, కన్నెఱికము, చుట్టరికము. తొత్తు-తొత్తరికము. వెజ్జు-వెజ్జరికము.

7. 'ఇమి' పేరు-పేరిమి. పోఁడి-పోఁడిమి. వాఁడి-వాఁడిమి.

8. 'న' నల్ల-నల్లన. పచ్చన, ఎఱ్ఱన, తియ్యన, కమ్మన, పుల్లన

మతుబర్థకములు.

'కలవాఁడు, కలది' అనునర్థములను దెలుపునవి మతుబర్థకములు.

9. 'కా' చెలిమి-చెలిమికాఁడు. వేఁట-వేఁటకాఁడు, ఆట-ఆటకాఁడు. ఎమ్మె-ఎమ్మెకాఁడు, చెలి-చెలికాఁడు.

10. 'కత్తియ' చెలి-చెలికత్తియ. అందము-అందగత్తియ.

11, 'ఈ' అటమటము-అటమటీఁడు. కమ్మతము-కమ్మతీఁడు.

12. 'అరి' జాలము-జాలరి. చదువు-చదువరి. తగవు-తగవరి.

13. 'త' సాలె-సాలెత. బోయ-బోయత. చాకి-చాకిత. వే-వ్రేత

14. 'ఇ' ఒయ్యారము-ఒయ్యారి. కడలు-కడలి. చాగము-చాగి.

15. 'ఆడి' వగలు-వగలాడి. చిన్నెలు-చిన్నెలాడి. వన్నెలు-వన్నెలాడి.

16. 'ఇఁడి' ముక్కు మొదలయినశబ్దములకు, వాని లేకుండుటను దెలుపును.

ముక్కు-ముక్కిఁడి-వెరవు-వెరవిఁడి. సిగ్గు-సిగ్గిఁడి.

పరిమాణార్థకములు.

17. 'ఎఁడు' తూము-తూమెఁడు, జేన-జెనెఁడు. గంప-గంపెఁడు. దోసిలి-దోసెఁడు, పుడిసిలి-పుడిసెఁడు.

షష్ఠ్యర్థకములు (లోతును దెలుపును)

18. 'బంటి, కోలఁది' ఱొమ్ము-ఱొమ్ముబంటి, ఱొమ్ముకోలఁది. మోఁకాలు-మోఁకాలుబంటి, మోఁకాలుకోలఁది.

ఇతరములైన ప్రత్యయములు నానార్థములందు ప్రయోగానుసారముగఁ దెలియవలెను.

19. 'మారి, పోతు' మంటమారి, తిండిపోతు. ఆస్వభావము గలవాఁడు.

20. 'అ' అడపము_అడప. తాంబూలపుఁ బెట్టెను మోయుస్త్రీ.

21. 'అము' పెండ్లి-పెండ్లము. పెండ్లాడిన యాఁడుది.

---

## వాక్యప్రకరణము

కొన్ని పదములు గలిసి యొక యర్థము నిచ్చినచో నట్టి పదముల సమూహమునకు "వాక్యము" అని పేరు.

వాక్యములు రెండువిధములు.

1. సమాపక వాక్యము. 2. అసమాపక వాక్యము.

సమాపకక్రియతోఁ గూడిన వాక్యము సమాపక వాక్యము. బాలుఁడు పాఠము చదివెను.

అసమాపకక్రియతోఁ గూడిన వాక్యము అసమాపక వాక్యము. బాలుఁడు పాఠము చదివి.

సమాపక వాక్యములు మూఁడు విధములు—

1. సరళవాక్యము (Simple Sentence)
2. సంశ్లిష్ట వాక్యము (Complex Sentence)
3. ద్వంద్వవాక్యము (Compound Sentence)

(1) ఒక్క సమాపకక్రియతో మాత్రము కూడిన వాక్యము సరళవాక్యము. దీనిని 'సామాన్యవాక్యము' అనికూడ నందురు.

బాలుఁడు పాఠముఁ జదివెను.

(2) ఒక్కసమాపకక్రియయు, ఒకటికాని యెక్కువకాని యసమాపకక్రియలును, గలవాక్యమునకు 'సంశ్లిష్ట వాక్యము' అని పేరు.

౧. బాలుఁడు పాఠము చదివి నిద్రించెను.

౨. బాలుఁడు పాఠము చదివి, వ్యాసము వ్రాయుచు నిద్రించెను.

3. రెండుకాని యెక్కువకాని సమాపకవాక్యములు కలిసినవాక్యమునకు ద్వంద్వవాక్య మని పేరు. దీనినే "మహా వాక్యము" అనికూడ నందురు.

(౧) బాలుఁడు పాఠము చదివెను; గానఁ బరీక్షలో జయించెను. ఇచట రెండు సమాపకవాక్యములు 'కాన' అను మాటచేఁ గలుపఁబడినవి.

(౨) వానికి లెక్కలు బాగుగా వచ్చును; గాని తెలుఁగులోఁ దెలివి లేదు; కాఁబట్టి పరీక్షలో జయింపలేదు.

ఇచట మూఁడు సమాపకవాక్యములు "కాని, కాఁబట్టి" అను రెండు మాటలచేఁ గలుపఁబడినవి.

ద్వంద్వవాక్యములలో సమాపకవాక్యములు కూడ నుండవచ్చును. అనఁగా ద్వంద్వవాక్యమునందలివి సరళవాక్యములే కానక్కఱలేదు: సంశ్లిష్టవాక్యములును గావచ్చును.

వాఁడు దిక్కులు చూచుచు, బడికిఁ బోవుచుండెను; కాఁబట్టి కాలికి దెబ్బ తగిలెను.

5

ఇచట 'వాఁడు దిక్కులుచూచుచు, బడికిఁ బోవుచుం డెను.' అనునది సంశ్లిష్టవాక్యము. 'కాలికి దెబ్బ తగిలెను' అనునది సరళవాక్యము. ఈ రెంటను "కాఁబట్టి" అనుపదముచేఁ గలుపఁబడినవి.

సమాసములు.

వేర్వేఱు అర్థములు గల కొన్ని పదములు గూడి, ఒక్క పద మగుట 'సమాస' మనఁబడును. సమాసములలోని పదములనే యుపయోగించి, సమాసమున కర్థము చెప్పుచో దానికి 'విగ్రహ' మని పేరు.

రామబాణము (సమాసము) రాముని యొక్క బాణము (విగ్రహము)

1. అవ్యయీభావము 2 తత్పురుషము 3. కర్మధారయము. 4. ద్విగువు 5. బహువ్రీహి 6. ద్వంద్వము—అని సమాసము లాఱువిధములు.

(1) పూర్వపదార్థము ప్రధానముగాఁ గలది అవ్యయీభావసమాసము. ఏపదముయొక్క యర్థము క్రియతో నన్వయించునో, ఆపదముయొక్క యర్థము ప్రధాన మనఁబడును. పూర్వపదార్థ మనఁగా మొదటి పదముయొక్క యర్థము.

మధ్యేసముద్రము, మీఁగాలు, పెడతల.

(2) ద్వితీయాదివిభక్తులు చివరఁ గలపదములకు మీఁది పదముతో వచ్చు సమాసము తత్పురుషసమాసము. దీనిలో ఉత్తరపదార్థము (రెండవపదముయొక్క యర్థము) ప్రధానము.

నెలతాల్పు—ద్వితీయా తత్పురుషము.

నెల తక్కువ వాఁడు—తృతీయా తత్పురుషము.

దేవరమేలు—చతుర్థీ తత్పురుషము.

దొంగభయము—పంచమీ తత్పురుషము.

రాముని యిల్లు—షష్ఠీతత్పురుషము.

మాటనేర్పరి—సప్తమీ తత్పురుషము.

(3) విశేషణమునకు విశేష్యముతోడి సమాసము 'కర్మధారయసమాసము'. దీనియందును ఉత్తరపదార్థమే ప్రధానము.

నీలోత్పలము, నల్లగుఱ్ఱము, వేఁడినీరు, లేఁజిగురు.

ఉపమానము పూర్వపదముగాఁ గలది 'ఉపమానపూర్వపదకర్మధారయము' —

చంద్రమోహానము, చిగురుమోవి.

ఉపమానము ఉత్తరపదముగాఁ గలది "ఉపమానోత్తరపదకర్మధారయము"—

హస్తపద్మము, కేలుఁదమ్మి, బాహులత.

అవధారణవాచకము పూర్వపదముగాఁ గలది "అవధారణపూర్వపదకర్మధారయము." దీనినే రూపకసమాస మని యందురు.

నిశాకాంత, రేవెలఁది, సేనాసముద్రము.

(4) కర్మధారయసమాసమున మొదటిపదము సంఖ్యావాచక మైనచో నది "ద్విగుసమాస" మనఁబడును.

త్రిభువనములు, నలువైపులు.

కర్మధారయసమాసమునందు ఉత్తరపదము పరమగునపుడు మూఁడు శబ్దమునందలి 'డు' అన్నుద్దానికి లోపమును, మిగిలిహల్లునకు ద్విత్వమును వచ్చును.

మూఁడు + జగములు=ముజ్జగములు, ముల్లోకములు, ముచ్చిచ్చు, ముక్కారు, ముప్పేసము.

(5) అన్యపదార్థము ప్రధానముగాఁగలది 'బహువ్రీహి సమాసము' అన్యపదార్థ మనఁగా సమాసమునందలి పదముల యర్థముగాక మఱియొక పదముయొక్క యర్థము.

ముక్కంటి, పీతాంబరుఁడు, దీర్ఘబాహువు, చలివెలుఁగు. మూఁడు+కన్నులు. ఈరెండును సమాసమునందలి పదములు. వీనియర్థము గాక 'శివుఁడు' అను నర్థమున కిచటఁ బ్రాధాన్యము. కావున నిది యన్యపదార్థ ప్రధానము.

(6) ఉభయపదార్థములు (రెండుపదములయొక్క యర్థములు) ప్రధానముగాఁ గలది "ద్వంద్వసమాసము".

రామకృష్ణులు, కూరగాయలు, తల్లిదండ్రులు.

మహద్వాచకములకు మహతీవాచకములకు ద్వంద్వమగుచోఁ గొన్నిచోట్ల పూర్వపదము తుదియచ్చునకు దీర్ఘము వచ్చును.

అన్న+తమ్ముఁడు=అన్నాదమ్ములు.

అక్క+చెల్లెలు=అక్కాచెల్లెండ్రు,

సమాసములందలి విభక్తు లన్నియును లోపించును.

రాముని యాజ్ఞ, చెట్టుమొదలు. (యొక్కకు లోపము)

తెలుఁగు సంధులు

ఒకపదము మఱియొకపదముతోఁ గలియునపు డేర్పడెడి రూపభేదమును సంధి యని యందురు. తెలుఁగులో 'సంధి' యనఁగా, మొదటిపదము చివరియచ్చు పోయి రెండవపదము మొదటియచ్చు నిలుచుట.

రాముఁడు+అతఁడు=రాముఁడతఁడు.

ఇచట 'రాముఁడు' అను పదమునందలి 'డు' లోని ఉకారము పోయి అతఁడులోని అకారము నిలిచెను. కావున నిట్టిది 'సంధి' యనఁబడును. ఈసంధులు కొన్ని నిత్యముగాను, కొన్ని వికల్పముగాను వచ్చుచుండును. సంధిరాని చోట నొక యచ్చు తరువాత మఱియొక యచ్చున్నచో నా రెండింటికి మధ్యను 'యకారము' ఆగమముగా వచ్చును.

మా+ఇల్లు=మా+య్+ఇల్లు = మాయిల్లు. ఎవ్వఁడో + ఒకఁడు = ఎవ్వఁడోయొకఁడు. ఏ+ఊరు=ఏయూరు. నీ+ఒద్ద=నీయొద్ద, మున్నగునవి.

1. అకారసంధి—అకారమునకు అచ్చు పరమగునపుడు సంధి బహుళముగా వచ్చును.

మేన+అత్త = మేనత్త. పుట్టిన+ఇల్లు = పుట్టినిల్లు, పుట్టినయిల్లు. చూడక+ఉండెను = చూడకుండెను, చూడకయుండెను.

ఆకు, అన్న మున్నగు శబ్దములు పరమగునపుడు కొన్ని చోట్ల అకారమునకు సంధి నిత్యముగా వచ్చును.

చింత+ఆకు=చింతాకు. చిన్న+అయ్య = చిన్నయ్య. సీత+అమ్మ=సీతమ్మ.

2. ఇకారసంధి—మధ్యమ పురుషక్రియలలోని 'ఇకారము'నకు సంధి నిత్యముగా వచ్చును. పలితివి+అతని=పలితివతని. చేసితిరి+అపుడు=చేసితిరపుడు.

ప్రథమోత్తమపురుష క్రియలలోని ఇకారమునకును, 'ఏమి' మున్నగు శబ్దములలోని ఇకారమునకును సంధి వికల్పముగా వచ్చును.

వచ్చిరి+అపుడు=వచ్చిరపుడు, వచ్చిరియపుడు. వచ్చితిని+అపుడు=వచ్చితివపుడు, వచ్చితినియపుడు. వచ్చితిమి+ఇపుడు = వచ్చితిమిపుడు, వచ్చితిమియిపుడు. ఏమి+అంటివి= ఏమంటివి, ఏమియంటివి. మఱి+ఏమి=మఱేమి, మఱియేమి. వానికిన్+ఇచ్చితివి=వానికిచ్చితివి, వానికినిచ్చితివి.

ఏమి, మఱి, 'కిన్' (షష్ఠీవిభక్తి,) అది, అవి, ఇది, ఇవి, ఏది, ఏవి మున్నగునవి. సంధి వచ్చినపుడు 'కిన్'అను దానిలోని నకారము లోపించును. సంధి రానపు డట్లే యుండును.

పైనఁ జెప్పిన చోటులలోఁ దక్క మిగిలిన చోటులందు ఇకారమునకు సంధి రాదు.

వచ్చి+ఇచ్చెను = వచ్చియిచ్చెను. హరి+అతఁడు = హరియతఁడు.

౬. ఉకారసంధి—ఉకారమునకు అచ్చు పరమగునపుడు సంధి నిత్యముగ వచ్చును.

రాముఁడు+ఎక్కడ = రాముఁడెక్కడ. అతఁడు + ఎవఁడు=అతఁడెవఁడు. నేను+ఉంటిని=నేనుంటిని. నీవు+ఒకఁడవు=నీవొకఁడవు.

ద్వితీయాదివిభక్త్యంతం బున్న ఉకారమునకును, శత్రర్థకమైన 'చు' వర్ణమునందలి ఉకారమునకును సంధి వికల్పముగా వచ్చును. సంధి వచ్చినపుడు ఉకారము తరువాత నుండిన నకారము లోపించును. సంధి రానపు డట్లే యుండును.

నన్నున్+అడిగె=నన్నడిగె,నన్నునడిగె. నాకొఱకున్+ఇచ్చె=నా కొఱకిచ్చె, నా కొఱకునిచ్చె. నాకున్+ఆదరణ=

నాకాదరణ, నాకు నాదరణ. నాయందుఁ+అణఁకువ = నాయందణఁకువ, నాయందునణఁకువ. వచ్చుచుఁ+ఉండెను = వచ్చుచుండెను, వచ్చుచునుండెను.

నన్ను నిన్ను తన్ను మిమ్ము లకు ద్విత్వలోపము వచ్చునపుడు సంధి రాదు.

ననుఁ+ఏలె=నను నేలె. మిమునడిగె. మమునాజ్ఞాపించె.

4. ఆమ్రేడితసంధి— ఆమ్రేడితము పరమగునపుడు అన్ని యచ్చులకు సంధి వచ్చును. ఒక పదము రెండు మాఱులుచ్చరింపఁబడునపుడు రెండవరూపము 'ఆమ్రేడిత' మనఁబడును.

ఆహా+ఆహా=ఆహాహా. ఏమి+ఏమి=ఏమేమి. ఓహో+ఓహో=ఓహోహో. ఔర+ఔర=ఔరౌర.

ఆమ్రేడితము పరమగునపుడు విభక్తికి లోపము బహుళముగా నగును.

అక్కడఁ + అక్కడఁ = అక్కడక్కడఁ, అక్కడనక్కడఁ. అప్పటికిఁ+అప్పటికిఁ=అప్పటప్పటికిఁ, అప్పటికప్పటికిఁ.

'అందదుకు' మున్నగు శబ్దములు ప్రయోగానుసారముగ సాధువులు.

అదుకులు + అదుకులు = అందనుకులు. ఊఁతలు+ఊఁతలు = ఉట్టూఁతలు. చెదరు + చెదరు = చెల్లాచెదరు. తుమురు+తుమురు=తుత్తుమురు.

5. ప్రకృతిప్రత్యయసంధి-పరిమాణార్థమునందు వచ్చెడి 'ఎఁడు' ప్రత్యయము పరమగునపు డన్నియచ్చులకు సంధి నిత్యముగా వచ్చును.

పీసె + ఎఁడు=పీసెఁడు. మూర + ఎఁడు = మూరెఁడు.

ప్రత్యయము పరమగునపుడు అన్ని యచ్చులకు సంధి తఱుచుగ వచ్చును.

చిఱుత + ఉక=చిఱుతుక. నాతి + ఉక=నాతుక. అర మర + ఇక=అరమరిక. వాఁడి + ఇమి = వాఁడిమి. ఎనిమిది + అవ=ఎనిమిదవ.

6. గసడదవాదేశసంధి—ప్రథమావిభక్తిమీఁది కచటతపలకు గసడదవలు బహుళముగ వచ్చును.

వాఁడు + కొట్టె=వాఁడు గొట్టె, వాఁడు కొట్టె. అతఁడు + చేరెను = అతఁడు సేరెను. అతఁడు చేరెను. అతఁడు + చనియె=అతఁడు సనియె, అతఁడు చనియె. ఆమె + తగవరి= ఆమె దగవరి, ఆమె తగవరి. అతఁడు + పలికె=అతఁడు వలికె, అతఁడు పలికె.

ద్వంద్వసమాసమునందీయాదేశము నిత్యముగా వచ్చును.

కూరలు + కాయలు=కూరగాయలు. ఇట్లే—కాలుసేతులు, టక్కుటెక్కులు, అన్నదమ్ములు, ఊరువల్లెలు.

7. ద్రుతప్రకృతికసంధి—ద్రుతప్రకృతికముమీఁది 'కచటతప'లకు, 'గజడదబ' లు నిత్యముగా వచ్చును; వచ్చునపుడు ద్రుతమునకు బిందువు (అర్ధానుస్వారము, లేక పూర్ణానుస్వారము) గాని, సంశ్లేషము (మీఁదిహల్లుతోఁ గలియుట) గాని, స్వత్వము (ద్రుతము మాఱకుండుట) గాని వికల్పముగా నగును.

~పూచెను+కమలము = పూచెఁగమలము, పూచెంగమలము, పూచెన్గమలము, పూచెనుగమలము. వచ్చెను+చక్రి= వచ్చెఁజక్రి, వచ్చెంజక్రి, వచ్చెన్జక్రి, వచ్చెనుజక్రి. పూనెను+టక్కు- పూనెఁడక్కులు, పూనెండక్కులు, పూనెన్డక్కులు, పూనెను డక్కులు. విరిసెను+తమ్మి=విరిసెఁదమ్మి, విరిసెందమ్మి, విరిసెన్దమ్మి, విరిసెనుదమ్మి. పూచెను+పద్మము=పూచెఁబద్మము, పూచెంబద్మము, పూచెన్బద్మము, పూచెను బద్మము. దీనినే 'సరళాదేశసంధి' యనియు నందురు.

ద్రుతమునకు సరళస్థిరములు పరమగునపుడు లోపముగాని, సంశ్లేషముగాని, స్వత్వముగాని వికల్పముగా నగును. వచ్చెను+గజము=వచ్చెగజము, వచ్చెన్గజము, వచ్చెనుగజము. తెచ్చెను+ఖడ్గము=తెచ్చెఖడ్గము, తెచ్చెన్ఖడ్గము, తెచ్చెను ఖడ్గము. వచ్చెను + శరము = వచ్చెశరము, వచ్చెన్శరము, వచ్చెనుశరము.

౩. ద్రుతముపై నచ్చు నిలుచునప్పటి కార్యములు— ద్రుతమున కచ్చు పరమగుచో ద్రుతములోని యచ్చు పోయి మిగిలిన నకారము తరువాతి యచ్చుతోఁ గలియును.
వానిని+అడిగెను = వానినడిగెను. కొడుకును+ఊరడించెను= కొడుకునూరడించెను.

అచ్చు పరమగుచో నొక్కొక్కచోట ద్రుతమునకు ద్విత్వము వచ్చును. అన్నియును+ఏవి అన్నియున్నేవి.

౪. అవసానద్రుతకార్యములు—ద్రుతములోనియచ్చు వాక్యముచివర నొక్కొక్కప్పుడు పోవును. వాఁడు నన్నుఁ

జూచెగా, వాఁడు నన్నుఁ జూచెను. నేను నిన్నుఁ జూచితిగా నేను నిన్నుఁ జూచితిని.

10. ద్రుత మంతయు వాక్యముచివర నొక్కొక్కప్పుడు పోవును. వాఁడు నన్నుఁ జూచె. నేను నిన్నుఁ జూచితి.

11. పడ్వాదిసంధి—'పడు' మొదలగునవి పరమగునపుడు 'ము' వర్ణమునకు లోపముగాని పూర్ణబిందువుగాని వికల్పముగా నగును.

భయము+పడు=భయపడు, భయంపడు, భయముపడు.

పడు, పెట్టు, పట్టు, పఱచు మొదలగునవి పడ్వాదులు.

12. త్రికసంధి—'ఆ, ఈ, ఏ' అను నీ మూఁడును 'త్రిక' మనఁబడును. అసంయుక్తమైన హల్లు పరమగునపుడు త్రికమునకు హ్రస్వమును మీఁదిహల్లునకు ద్విత్వమును బహుళముగా వచ్చును.

ఆ+కన్య=అక్కన్య. ఈ+పుస్తకము=ఇప్పుస్తకము. ఏ+కాలము=ఎక్కాలము. ఆ+పలుకులు = అప్పలుకులు ఈ+కుమారులు=ఇక్కుమారులు. ఏ+విధము = ఎవ్విధము.

13. టుగాగమసంధి—కర్మధారయ సమాసమునందు 'ఉకారము'న కచ్చు పరమగుచో 'టు' ఆగమముగా వచ్చును.

కఱకు+అమ్ము = కఱకుటమ్ము. చెక్కు+అద్దము= చెక్కుటద్దము. సరసము+అలుక=సరసపుటలుక.

ఈటుగాగమము కొన్నిచోట్ల ఉకారాంతములు కాని వానికిఁగూడ వచ్చును.

మిద్దె+ఇల్లు=మిద్దెటిల్లు. దుక్కిటెద్దు, పల్లెటూరు.

ఈయాగమము షష్ఠీతత్పురుషమునందును గానవచ్చును.

వేల్పు + ఏరు = వేల్పుటేరు, సముద్రము + ఒడ్డు = సముద్రపుటొడ్డు.

కర్మధారయమునందు 'పేరు' మున్నగుశబ్దముల కచ్చు పరమగునపుడు 'టు' ఆగమము వికల్పముగా వచ్చును.

పేరు + ఉరము = పేరుటురము, పేరురము. పొదరు + ఇల్లు = పొదరుటిల్లు. పొదరిల్లు. చిగురు + ఆకు = చిగురుటాకు, చిగురాకు.

14. ద్విరుక్తటకారాదేశసంధి—కుఱు, చిఱు, కడు, నడు, నిడు-శబ్దముల 'ఱ, డ' ల కచ్చుపరమగునపుడు ద్విరుక్తమైన టకారము (ట్ట) ఆదేశ మగును.

కుఱు + ఉసురు = కట్టుసురు. చిఱు + ఎలుక = చిట్టెలుక. కడు + ఆయితము = కట్టాయితము. నడు + అడవి = నట్టడవి. నిడు + ఊరుపు = నిట్టూరుపు.

ఆమ్రేడితము పరమగునపుడు 'కడ' మొదలగు శబ్దములలోని మొదటివర్ణము మిగిలి, తక్కినవర్ణము లన్నిటిస్థానమున ద్విరుక్తటకారము ఆదేశముగ వచ్చును.

కడ + కడ = కట్టకడ. తుద + తుద = తుట్టతుద. కొన + కొన = కొట్టకొన పగలు + పగలు = పట్టపగలు. నడుము + నడుము = నట్టనడుము. బయలు + బయలు = బట్టబయలు. ఎదుట + ఎదుట = ఎట్టయెదుట.

15. దుగాగమసంధి—నీ, మీ. నా, మా, తన, తమ శబ్దములకు ఉత్తరపదము పరమగునపుడు 'దు' ఆగమము వికల్పముగా వచ్చును.

నీ+కరుణ=నీదుకరుణ, నీకరుణ. మా+నేరమి=మాదు నేరమి, మానేరమి. తన+పేరిమి = తనదుపేరిమి, తనపేరిమి.

16. రుగాగమసంధి--కర్మధారయమున 'పేద'మున్నగు శబ్దములకు 'ఆలు' శబ్దము పరమగునపుడు 'రు' ఆగమముగా వచ్చును. జవ+ఆలు=జవరాలు, బాలింత+ఆలు=బాలింతరాలు.

తత్సమశబ్దముల కాలుశబ్దము పరమగునపుడు రుగాగమమును, తుదినున్న అకారమునకు ఉకార మాదేశముగను వచ్చును.

ధీర+ఆలు=ధీరురాలు. గుణవంత+ఆలు=గుణవంతురాలు.

17. నుగాగమసంధి— (ఎ) కర్మధారయసమాసము నందు ఉకారాంతములైన స్త్రీ సమశబ్దములకును, మువర్ణమున కాదేశముగ వచ్చిన పుం, పు లకును పరుషసరళములు పరమగు నపుడు 'ను' ఆగమముగ వచ్చును. కర్మధారయసమాసము నందును, షష్ఠీతత్పురుషసమాసమునందును 'ము' వర్ణమునకు 'పు, ంపు' లు ఆదేశముగ వచ్చును. ఈ యాగమము (ను) ద్రుతము కావున పరుషములు పరమగునపుడు బిందుసంశ్లేష ములును, సరళస్థిరములు పరమగునపుడు లోపసంశ్లేషములును వచ్చును. స్వత్వము రాదు.

చిగురు+కైదువు=చిగురుఁగైదువు, చిగురుంగైదువు, చిగురున్గైదువు. కొలువు+కూటము=కొలువుఁగూటము, కొలువుంగూటము, కొలువున్గూటము. సరసము+తనము=సరసపుఁదనము, సరసంపుఁదనము, సరసంపుందనము, సరసపున్దనము

సరసంపున్ననము. సరసము + గుణము = సరసపుగుణము సరస పున్గుణము.

(బి) తద్ధర్మార్థవిశేషణములందలి 'ఉకారమునకును' షష్ఠీతత్పురుషమునందలి ఉకార ఋకారములకును, అచ్చు పరమగునపుడు 'ను' ఆగమముగా వచ్చును.

చేయు + అతఁడు=చేయునతఁడు. వచ్చు + ఎడ=వచ్చునెడ. పోయెడు + ఆమె=పోయెడునామె. చూచు + అప్పుడు, చూచునప్పుడు. రాజు + ఆజ్ఞ = రాజునాజ్ఞ. విధాతృ + ఆనతి= విధాతృనానతి.

18. ప్రాఁతాదిసంధి—సమాసములందు 'ప్రాఁత' మున్నగు శబ్దముల మొదటియచ్చు మీఁదనున్న వర్ణముల కన్నిటికిని లోపము వికల్పముగా వచ్చును. లోపింపఁగా మిగిలిన దానికి పరుషములు పరమగునపుడు 'ను' ఆగమముగా వచ్చును.

ప్రాఁత + కెంపు=ప్రాఁగెంపు, ప్రాఁతకెంపు. వేఁగు + పోక=వేఁబోక, వేగుఁబోక. కాను + తీఁగ=కానుఁదీగ, కాఁదీఁగ. లేఁత + దూడ=లేదూడ, లేఁతదూడ. ప్రాఁత + ఇల్లు=ప్రాయిల్లు, ప్రాఁతయిల్లు. పూవు + బంతి=పూబంతి.

క్రొత్తశబ్దమునకు మొదటి యక్షరము మిగిలినపుడు కొన్ని చోట్ల 'ను' ఆగమమును, కొన్ని చోట్ల మీఁదిహల్లునకు ద్విత్వమును వచ్చును.

క్రొత్త + పసిఁడి=క్రొంబసిడి. క్రొత్త + చాయ = క్రొంజాయ, క్రొత్త + కారు=క్రొక్కారు. క్రొత్త + మెఱుఁగు = క్రొమ్మెఱుఁగు. ఈ లోపమును, నుగాగమమును, ద్విత్వమును ఇతరశబ్దములమీఁద సైతము కానఁబడుచున్నవి.

పది+తొమ్మిది=పందొమ్మిది. నెఱ + మది=నెమ్మది. నెఱ+వడి=నెవ్వడి. నెఱ+చెలి=నెచ్చెలి మొదలగునవి.

సంస్కృతసంధులు.

1. సవర్ణదీర్ఘసంధి—'అ ఇ ఉ ఋ' అను వర్ణములకు క్రమముగ సవర్ణములు పరమగునపుడు ఆ రెండిటికి వానివాని దీర్ఘము ఏకాదేశముగ వచ్చును.

రామ+అనుజుఁడు=రామానుజుఁడు. చంద్ర+ఆస్య = చంద్రాస్య. రమా+ఆరాధనము=రమారాధనము. కవి+ఇంద్రుఁడు=కవీంద్రుఁడు. గురు+ఉపదేశము = గురూపదేశము. వధూ+ఊహాలు=వధూహాలు. పితృ+ఋణము = పితౄణము.

2. గుణసంధి—అకారమునకు 'ఇ, ఉ, ఋ' లు పరమగునపుడు వరుసగా 'ఏ, ఓ, అర్, లు ఆదేశముగ వచ్చును.

దేవ+ఇంద్రుఁడు=దేవేంద్రుఁడు. రమా + ఈశుఁడు = రమేశుఁడు. పరమ+ఈశ్వరుడు = పరమేశ్వరుఁడు. చంద్ర+ఉదయము = చంద్రోదయము. గంగా+ఊర్ములు = గంగోర్ములు. కృష్ణా+ ఉదకము = కృష్ణోదకము. పరమ+ఊష్మము=పరమోష్మము. దేవ+ఋషి = దేవర్షి, దేవఋషి. వసంత+ఋతువు= వసంతర్తువు, వసంతఋతువు.

3. వృద్ధిసంధి—అకారమునకు 'ఏ ఐ, ఓ ఔ' లు పరమగునపుడు, 'ఐ ఔ' లు ఆదేశముగ వచ్చును.

జన+ఏకత్వము = జనైకత్వము, మహా+ఐశ్వర్యము = మహైశ్వర్యము, నాక+ఓకసులు=నాకౌకసులు, దేశ+ఔన్నత్యము=దేశౌన్నత్యము.

మాత్రము తప్పక యావృత్తము లగును. అచ్చులు మాఱి నను నిబ్బంది లేదు. ఉదా:—మనసైన మనసైనికనికా యంబులోఁ గాయంబు గాయంబు పడనివాఁడు లేఁడు.

అర్థాలంకారములు.

ఉపమాలంకారము:—ఒక వస్తువునకు మఱియొకవస్తువుతో అందముగాఁ బోలిక చెప్పుట యుపమాలంకారము.

ముఖము చంద్రునివలె సుందరమైనది.

ఇచట ముఖమునకుఁ జంద్రునితోఁ బోలిక చెప్పఁబడినది. దేనితోఁ బోలిక చెప్పఁబడినదో యది యుపమానము. దేనికిఁ బోలిక చెప్పఁబడునో యది యుపమేయము. పోలికను దెలుపుపదము ఉపమావాచకము. ఏగుణముచేఁ బోలిక చెప్పఁబడునో యది సమానధర్మము. ఇచట ముఖము ఉపమేయము. చంద్రుఁడు ఉపమానము. వలెను అనునది యుపమావాచకము. సౌందర్యము సమానధర్మము.

రూపకాలంకారము:— ఉపమానమును ఉపమేయమును ఒక్కటే యని చెప్పుట రూపకాలంకారము.

ఈ ముఖము చంద్రుఁడే.

ఇచట నుపమేయ మగుముఖమును, ఉపమాన మగు చంద్రుఁడును నొక్కటిగాఁ జెప్పఁబడినవి. ఇట్లే "ముఖ మనెడి చంద్రుఁడు" అనుచోటను, ఈ యర్థముగల "ముఖచంద్రుఁడు" అను సమాసమునందును రూపకాలంకారమే.

ఉత్ప్రేక్షాలంకారము:— సొగసుగా నూహించుట యుత్ప్రేక్ష.

(1) రాజా! నీప్రతాపముయొక్క వేఁడినిగూర్చి విని సవమానముచేఁగాబోలు దావాగ్ని యడవులపా లయ్యెను.

దావాగ్ని యడవులలో నుండునదియే. అయినను రాజు ప్రతాపముకంటెఁ దనవేఁడిమి తక్కువయైపోవుటచే నవమానపడి యడవులకుఁ బోయెనేమో యని కవి సొగసుగా నుత్ప్రేక్షించియున్నాఁడు.

(2) "పరీక్షకుఁ జదువునట్టి విద్యార్థీ ! త్వరగా లెమ్ము. బాగుగా బోధపడుటకై ప్రశాంత సమయమునఁ జదువుకో. బాగుగా బోధపఱచుకో. పరీక్షలో జయము సంపాదించుకో." అని విద్యార్థిని లేపుటకుఁ గాఁబోలు కోళ్లు కూయుచున్నవి.

తెల్లవాఱుజామునఁ గోళ్ళు కూయుట స్వభావమే అయినను రాత్రి మేలుకొని, మొద్దునిద్ర పోవుచున్న విద్యార్థియందలి ప్రేమచే, వానిని లేపుటకుఁ గాఁబోలు నిట్లు కూయుచున్నవని కవి చమత్కారముగ నుత్ప్రేక్షించియున్నాఁడు.

అతిశయోక్త్యలంకారము:— ఒక వస్తువును మిగుల నతిశయముగా (గొప్పగా వర్ణించుట యతిశయోక్తి.)

ఈపురమందలి మేడలు చంద్రమండలము నతిక్రమించినవి. తన గమనమున కీమేడ లడ్డు వచ్చుటచేఁ జంద్రుఁ డీమేడల కిటికీలగుండ లోనికిఁ దూఱి, మరల నావలికిటికీలగుండ బయటికిఁ బోయి, తన ప్రయాణము సాగించుచున్నాఁడు.

మేడ లెంత యెత్తుగానున్నను చంద్రమండలము వఱకు వ్యాపించుట యసంభవము. అయినను అట్లు వర్ణించుట యతిశయోక్తి. ఇట్లు చెప్పుటచే నీమేడలు మిక్కిలి యెత్తుగానున్నవని యర్థము.

స్వభావోక్త్యలంకారము:—ఒక వస్తువును స్వభావసిద్ధముగునట్లు సొగసుగా వర్ణించుట స్వభావోక్తి.

ఒక యుద్ధముగ్గాని, ఉత్సవముగాని, పెండ్లియందలి పేరంటాండ్ర తొందరలుగాని, అత్తకోడండ్రి వాక్కలహములు గాని, యిప్పుడు మనకన్నులయెదుట జరుగుచున్నవేమో యను నట్లు వర్ణించుట.

అర్థాంతరన్యాసాలంకారము:—ఒక సంగతినిసమర్థించు టకై మఱియొక సంగతిని జెప్పుట యర్థాంతరన్యాసము.

"పాప మీబాలుని కళాశాలాధికారులు కఠినముగా శిక్షించినారఁట! ఔను; తప్పుచేసినవారిని పెద్దలుశిక్షింపరా?" ఇచ్చట కళాశాలాధికారులు కఠినముగా శిక్షించినారన్నసంగ తిని సమర్థించుటకై తరువాతివాక్యము చెప్పఁబడినది. అనఁగా మొదటిసంగతి వినఁగానే "అయ్యో! పాపము; ఈ బాలుఁడు గొప్పతప్పు చేసినాఁడే యనకొందము. అయినను దల్లిదండ్రు లను వదలి దూరము వచ్చి విద్యకొఱకై పలుకష్టముల పాలగు చున్న యీపసివానిని శిక్షించుటకై యీయధికారి కెట్లు మన సొప్పెను" అనెడి యాక్షేపణము రాఁగా, నధికారి యట్లు చేయుట న్యాయమే యని తెల్పుటకై రెండవసంగతి చెప్పఁ బడెను.

విషమాలంకారము:— ఒక సంగతిని జెప్పి, దానికి పొత్తుగా సంబంధములేని మఱియొక సంగతిచెప్పి అది యెక్కడ యిది యెక్కడ అని చెప్పుట విషమాలంకారము.

(1) నక్క యెక్కడ? నాకలోక మెక్కడ?

(2) నీ వెక్కడ? పందెము గెలుచుట యెక్కడ?

యథాసంఖ్యాలంకారము:—కొన్ని సంగతులు చెప్పి, వానికి సంబంధించిన మఱికొన్ని సంగతులను జెప్పి, యందు

మొదటి దానికి మొదటిదియు రెండవ దానికి రెండవదియు, నిట్లు సంబంధపఱచుచో నచట యథాసంఖ్యాలంకారము, లేక క్రమాలంకారము.

"కచ్ఛపమూషికములు జలబిలములఁ దూఱెను." కచ్ఛపము (తాఁబేలు) జలమునను, మూషికము బిలమునను దూఱినవి.

---